ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము. సంఖ్య ౪౪.

శ్రీరస్తు.

# కవిజనోజ్జీవని-సమస్యలు.

కోటి శ్రీరాయరఘునాథ తొండమాన్ మహీపాలుఁడు.



కాకినాడ.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటితము.

1937.

వెల 0-4-0

కాకినాడముద్రాక్షరశాల-కాకినాడ.

# కవిజనోజ్జీవని-సమస్యలు.

---

సమస్య లనఁగాఁ గవిని బరీక్షించుటకై పెద్ద లిచ్చెడు పద్యాది భాగములు. వీనిని గైపదము లందురు. కవికిఁ గలభాషాపాటవమును గనిపట్టుటకై కవితయందలి యభ్యాసవిశేషములను దెలిసికొనుటకై యొనఁగెడు ప్రశ్నలు. సమస్యలు సంస్కృతమునందును గలవు. తద్ద్వారముననే మన తెనుఁగులోనికిని దిగినవి. సమస్య యిచ్చుట యనునది కవిని బరీక్షించుటలోని కఠినభాగము. చదివిన శాస్త్రాంశముల నడిగిన నిట్టె చెప్పవచ్చును గాని సమస్య లట్టివి కావు. అష్టావధానములో నిది యొకయంగముగా నున్నది. సమస్యలిచ్చుటలో ననేకవిధములు. సాధారణముగాఁ బద్యము నాల్గవచరణము నిచ్చి యొకటి మూఁడుచరణములును సందర్భానుసారముగాఁ బూరింపు మందురు. కడపటిచరణములో నక్షరలోపనమో యర్థవంచనమో-యుండును. కొందఱేదియో యొక వాక్యము నిచ్చి యిది యేవృత్తములో నిముడు నని యడుగుదురు. కొన్నిపదములనిచ్చి వీని నీవృత్తములో నిముడింపు మని యడుగుదురు.

నగరు, వగరు, పొగరు, తగరు సనుమాటల నిచ్చి భారతభాగవతరామాయణార్థముల నిచ్చునట్లుపద్యములు చెప్పుమని రాధామాధవ కవి నడిగినారఁటగదా. స, సే, మి, రా. - అ, ప్ర, శి, ఖ. అను సంస్కృత ప్రశ్నలును సమస్యలలోనే చేరును.

గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ యని సమస్యయిచ్చినఁ బద్యములో నొకకవి యిమిడించెనఁట గదా: ఇట్టివే సమస్యలు. ఇందుఁ గొన్ని చాలఁ దేలికగాఁ గనఁబడును. పూరించుటకుఁ గూడఁ దేలికయే యగును. కొన్ని చిక్కులుపెట్టునవి కలవు. సమస్యలను బూరించుటకుఁ గవి కుభయభాషలలోనే కాదు పరభాషలలోఁ గూడ ననుభవము కొన్నింటి కవసరమైనట్లు కనఁబడుచున్నది.

" తలకాయలపులుసుద్రావి తనిసిరిబాపల్"

" కప్పను గని పాము భీతి గడగడ వడఁకెన్."

ఇట్టివి చాలఁ దేలికగా నుండును.

" ఏకాదశినాఁడు సప్త మేడేగడియల్."

దీనిపూరణమునకై కొంతయూహా యుక్తియు నవసరము.

" గుండ్రాతికిఁ గాళ్లు వచ్చి గునగున నడిచెన్."

దీనిని బూరించుటయే ప్రధాన మైనది గాని-కోదండ్రాముఁడు, "ఇంద్రా ప్రాసము" "ఈంద్ర" యాతఁడు సమస్య యిచ్చె ననుట యంత సరసముగాదు.

మొత్తముమీఁదఁ గవులను బరీక్షించుటకే సమస్యలు పుట్టిన వనుకొనవచ్చును. సమస్యాపూరణము వలన సాహిత్యబలము వృద్ధియగును. కొందఱకుఁ జదరంగపు పిచ్చివలెనే సమస్యలపిచ్చి యెక్కువ. ఒక్కయష్టావధానిం గాంచిరా, యొక్కకవి తారసిల్లెనా, చాలఁజిక్కులసమస్య లిచ్చెదరు.

"ఇఁక నొకలక్షయిచ్చెదను నింకకుఁ బద్యము చెప్పు సత్కవీ" యని సమస్యయిచ్చిన- " ఇఁక నొకలక్ష యిచ్చినను నింకకుఁ బద్యము చేయ సత్ప్రభూ" అని చెప్పినట్లు విందుము.

" సంస్కృతవాసనామహిమ చాలదుగా భువి నెంతవానికిన్ " అని యెవ్వరో -మాడుగులసంస్థానములోఁ గాఁబోలు- సమస్య యిచ్చినట్లును అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారుకాఁబోలును రెండుచరణములు పూరించినట్లును వినియుంటిని. విషయమును చెప్పుటకే కాని దీనిని యథార్థవిషయముగా నన్నింటిలో నెంచుటకుఁ గాదు. అతివిస్తారము వలదు.

ఈసమస్యల పుస్తకమును తిరుచినాపల్లిజిల్లా, నవసాలపురమను పుదుకోట (క్రొత్తకోట) రాజైన రఘునాథభూపాలుఁడు రచియించెను. పుదుకోట స్వతంత్రసంస్థానము. ఈరాజవంశమునకు, తొండమాను లను

బిరుదనామము గలదు. ఈరఘునాథతొండమాన్ భూపాలుఁడు 1767వ సం. మొదలు 1789 వ సం. వఱకుఁ బరిపాలించెను. ఇతనియొద్దఁ బెద్ద విద్వాంసుఁడు సుదురుపాటి వేంకనార్యుఁడని యొకఁడు కలఁడు. ఈరాజు తండ్రి విజయరఘునాథతొండమాన్ మహీపాలునియొద్ద నీవిద్వాంసుని తండ్రి యుద్దండకవి బిరుదుగల సీతారామశాస్త్రి యుండెను. ఈవెంకన కవికుమారులు సాంబకవి మున్నగువారుండిరి. వీరందఱును ననేకగ్రంథములను రచించిరి. ఈసమస్యలను వెంకనకవి యిచ్చుచుండిన రఘునాథభూపాలుఁడు పూరించినట్లు పుస్తకములోఁ జెప్పఁబడినది. ఈరాజు మున్ను పార్వతీపరిణయమను ప్రబంధమునుగూడ రచియించియున్నాఁడు. దానిలోఁ దన యాస్థానమునందలి విద్వాంసుఁడగు వెంకన్నకవిని బ్రశంసించియున్నాఁడు. దానింబట్టి కొందఱు వెంకనకవియే రచియించి పార్వతీపరిణయమునకు రాజుపేరు పెట్టినాఁ డందురు. అట్లు దీనినిగూడ భావించెదరు. మనలో నున్నదియే, కృష్ణదేవరాయలు నే నాముక్తమాల్యదను రచించితి నని యెన్నో సాక్ష్యములతోఁ జెప్పుచున్నను మనవారు దానిని బాటింపక పెద్దనార్యుఁడు రచించినాఁ డని చెప్పెదరు. ఇంకఁ దక్కినవారి మాటేమందుము. కల్పనలలో, వంచనను నిస్సారకల్పనలలో, వానిని నమ్ముటలో మనవా రందె వేసిన చేతులుగదా! సుప్రసిద్ధులు విద్వదగ్రణులు వేదము వేంకటరాయశాస్త్రులవంటివారు, ఆముక్తమాల్యదను శ్రీకృష్ణరాయలు రచించిన దని యొప్పుకొనక పెద్దనపేరు లోకులు చెప్పుచున్నను దానిం బాటింపక, చివరకుఁ బుస్తకముమీఁదఁ దమ పేరైన వేసికొన్నారుగాని రాయలపేరు గాని పెద్దనార్యునిపేరు గాని వేయఁ జేయాడినవారు కారైరి. ఇంక నితరుల లెక్కయేమి. మల్లినాథసూరి యెంత కొట్టుకొనుచున్నను బెద్దిభట్టుగారని మనవారు వాడుటమానరుగదా? పండితబృందము సభలో నుండఁగా రాజు రసికుఁడు కారాదా, కాఁడా? రాజు లంతయజ్ఞానులా! భోజరాజుమాట యేమిచెప్పెదరో వీరు. ఇంక విస్తరింపరాదు. పండితుఁడగు సుదురుపాటి వెంకన్నకవి కవిత్వమునకును ఈరాజుకవిత్వమునకు

ను భేదమున్నట్లు విమర్శకులుఁ, బండితులు, నిదివఱకొప్పుకొన్నారు. ఏవి వెంకన్నవంటివాఁడు ప్రయోగింపఁడని రఘునాథరాజు నెత్తిని రుద్దినాఁడో యట్టివియే యీసమస్యలలోఁ గూడఁ గలవు గావున దీనిని వెంకన్నకవి కంటఁగట్టరనితలఁచెదను. ఆర్యులారా! నామములను నమ్మక నామములను విశ్వసింపుఁడు. ఇటీవలి మృత్యుంజయ కవివంటివారు ధనాశచేఁ బలువుర పేర బహుగ్రంథములు రచించినట్లు కనఁబడుచున్నదిగాని- ఆంధ్రభాషార్ణవమువంటి శ్రేష్ఠతరాంధ్రనిఘంటువును రచియించి యాంధ్రులకు భిక్ష పెట్టినవిద్వాంసుఁడు డబ్బుకక్కుఱితిని హీనకావ్యమును జేయఁడు. భోజమహారాజు మొదలిప్పటి చిన్నచిన్న ప్రభువులవఱకును వారివారి యాస్థానములలో ననేకులు కవులుఁ బండితులు నిల్చియున్నారు. అరసికు లయినరాజులు కవుల నాదరింతురా!

ఏవయిన దోషపదములు (వరించేవేళ, దివ్యరత్నకలితంబగుట ద్యుతివిధంబున) కలిగిన నవి యప్పటికి గ్రామ్యకక్ష్యలోఁ జేర్పనివారు కొందఱుండియుందురని తలంచుట లెస్స. కవులు సమ్మతించి రనవచ్చును. అంతియకాని రాజులు చెప్పినవి తప్పులు వారికవులు చెప్పినవి యొప్పులు ననుట సమంజసము గాదు. ఏవియో కొన్ని పదములు విరుద్ధములు దొరలినను- వానిని రాజు కవికిఁ జూపించిన సమర్థించి సందర్భశుద్ధిగా నున్నంచుననో దిద్దిన నచ్చట సరిగాఁ గుదుర దనియో ప్రభువును దప్పులు పట్టుటకు శంకించియో యట్టివానిని సమ్మతించినంతన యేమాయె. మఱియు నొక్కరు రచించిన తప్పుల పుస్తకమును విద్వాంసుఁడు దిద్దిన నది యతనిశైలికే వచ్చును. భేద మెట్లు తెలియును. ఇప్పు డిట్టివెన్ని వెలువడుటలేదు! శాంతము పాపము!

ఈకవిజనోజ్జీవని పరిషత్పుస్తకభాండాగారములో 3852వ సంఖ్యను గలదు. ఈకాగితముపుస్తకము పరిషత్తునకు దక్షిణదేశమునఁ బుస్తకసంపాదన మొనర్చిన బ్ర. హరి సీతురామయ్యగారు సంపాదించినది. ఇది వారి స్వహస్తలిఖితము. ఈయన వెంకనకవిగారి బంధుకుటుంబములోనివారు.

తీరిచినాకల్లిలో నున్నారు. ఇందలివివరణములలోని కొన్నిమాటలు మేము సవరణ చేసితిమి. కొన్ని యిప్పటివారికి రుచింప వని తొలఁగించితిమి. ౧౦౮ పద్యములకు ౯౯ మాత్రమే ప్రకటించితిమి. తొలఁగింపఁ బడినవి యభిలాషగలవారు మూలగ్రంథములోఁ జూడవచ్చును.

లికుచంబులు కొండలంత లేదా వాడా.

రాళ్లు తనుదాన గూసెను రాజవదన.

మగవానికి నెత్తి యాఁడవాఁడే తలఁపగ.

ధారుణి పాదవయ్యె గిరులు తలక్రిందయ్యెగ.

అగ్నికిఁ గాళ్ల యిమ్మగాక యధికముగలదే.

ఇట్టివి పూరణములోఁ జమత్కృతి లేనివి, యసభ్యముగా నుండు నేమో యనుకొన్నవి తొలఁగింపఁ బడినవి. "పగటిఁ జంద్రిక" యను 48వ సమస్యకు రెండుపద్యములున్నవి. ఒకటిపద్యముం దొలఁగించితిమి. ఇప్పటికిని కొన్ని పూరణములు శ్లేషలమూలమునఁ జక్కగాఁ గుదురుట లేదు. వంకాయ, వాకాయ, బీర(ఱ)కాయ-జాబీరకాయ యను నిట్టివి చూడుఁడు.

ఇది నిజముగాఁ గవిజనోజ్జీవనియే. 73వ పద్యము శ్లోకప్రాసయుతము. 75వది-గోగ్రణిగో అగ్రణీగవాగ్రణి.-ఇట్టివి పండితుఁడు కానివాఁడు పూరించినవి కావు. పాండిత్యము లేనివాఁడు పార్వతీపరిణయమును రచింపఁ గలఁడా. అంతెంత లోకానుభవవిషయమున్నదో చిత్తగింపరా! అక్షరగోపన వృత్తగోపన సమస్యలు, సాధారణములా! అవి సాధారణులకు సాధ్యములా! మాపరాకునన్ కావచ్చును-గ్రంథముచివరకాగితములో నొక్క ప్రక్కను "౨౮ (a) నాలుగేళ్లును నెనిమిదే నలినసయన-

తే. గీ. పసునొక్కటికిని నాలుగ్గులుండ
నిరుడు కొలుచుమూఁడె గాదెలఁ దఱచుగాను
అల్ల యెడ్లలలో సగ మమ్మివేయ
నాలుగేళ్లును నెనిమిదే నలినసయన."

అనుక్రోక్షకావ్యముగలదు. మొదట విడువఁబడినది. మూలములోఁ జేరలేదు. అర్థమేని చేర్చుకొనుఁడు. అంగములలో దొరకుసమస్యల పుస్తకముకంటె నిందనేకవిధముల విశేషములతోఁ గూడిన పద్యములుగలవు. చదువరులకు నేను దెలుపనక్కఱయుండదు.

కవనమునం దాదరముగలపాఠకులార ! సమస్యలనాదరింపుఁడు; సమస్యాపూరణమునందును సమస్యల నిచ్చుటయందును నిపుణుల రగుఁడు. పెక్కులు సమస్యలం జదివినఁగాని మీకు దానియం దుత్సాహము కలుగదు, కలిగినంగాని చమత్కారముగ సమస్యల నీయఁజాలరు, పూరింపఁజాలరు. సమస్యాదరణము-భాషాభివృద్ధికి మూలమగును.

పుదుకోట, దానిప్రభువులను, వారివిద్వాంసులను, వారివారి గ్రంథములం దెలుపుచు విరివిగాఁ బరిషత్తువారు చక్కని చరిత్రము వ్రాయించనున్నారు. కావున నీచిన్నపొత్తము పీఠికలో విశేషింపలేదు.

విద్వద్విధేయుఁడు,
క్రొత్తపల్లి సూర్యరావు.

ప్రకటితముసేయు మీయాకృతి
సృకలుమగిరిభేదకంబ శ్రీబృహదంబా.

ఈక్రిందివి శబ్దచిత్రసమస్యలు.

(2) "ప్రకచము జలధరముపోలెఁ గడు నింపెసఁగెన్."

క. మకరాంకకేళికోద్రే
కకరత్వం బెంచి చూడఁగాఁ జెలికిఁ జక
చ్చకితరుచిఁ జయమగు న
ప్రకచము జలధరముపోలెఁ గడు నింపెసఁగెన్.

(3) "కావేరే శిరముపైని గట్టఁగనలయున్."

క. నీవంటి రూపవంతున
కేవేళను జీటిసేగమే కాకను జెం
గావి మొకలైనపాగలు
కావేరేశిరముపైని గట్టఁగనలయున్.

కా=కాదు, వేరే (శ్రే) శిరము- అని పదవిభాగము.

వేఱుపూరణము.

క. స్త్రీవశ్యమునకు సిద్ధం
డేవేయు నోసంగె దాని నెఱుఁగుమువే కా
యీవనితామణివలచుట
కావేరే శిరముపైని గట్టఁగవలయున్.

వలచుటకు- ఆవేరే, అల్లవేరే- అని పదవిభాగము.

(4) "వాతెఱ లేకొక్క వనిత వర్షం బుండెన్."

క. సీతాంగన యొక్కతయే
వాతికి నెరలేక యొక్క వర్షంబుండెన్
ఆతెఱఁగున మఱి యేతటి
వాతెఱ లేకొక్క వనిత వర్షంబుండెన్.

వాతికిన్ + ఎరలేక ; వాతెఱ=మోవి.

(9) "ముక్కున నలమానవుండు భూరి యొసంగెన్."

క. కక్కసమా పదియవమా
లక్కట యనుమాడఁ దరుణి యాత్మజు గడెలోఁ
జక్కఁగఁ గవఁగాఁ గని యొక
ముక్కున నలమానవుండు భూరి యొసంగెన్.

"కనకొక ముక్కున" అనియుండవచ్చు నని తోఁచెడిని (ముక్కు=తినుకుటకంటిది.) ముక్కుట మూల్గుట- భూరి=పుత్రోత్సవసందర్భమున సువర్ణాదిదానము.

(10) "వంకాయా పెసరకాయె వడ్లాజొన్నల్"

క. వంకాయ లమ్ముదానివి
జెంకను జెట్టేసి సరకుఁ జేకొనెఁ జోరుం
డింకేమి చెప్ప మాకుఁ
వంకా యాపె సరకాయె, వడ్లాజొన్నల్.

ఉత్తరప్రత్యుత్తరవిషయ సమస్య - వంకాయ, పెసరకాయ, వడ్లు, ఆజొన్నల్ వంకాయలమ్మెదాని సరకుగా నాయెను, విషయపరిహారము.

(11) "నీవేచేసితివి గాక నేచేసితివే."

క. ఏవేళఁ దప్పవెట్టెద
వోవనితా దేవపూజ కుంచక మునుపే
కావలసిన భక్ష్యంబులు
నీవేచేసి తిని కాక నే చేసితివే.

నీవచేసి=నీవేపాకము చేసి, తిని=దేవతానైవేద్యముకుఁ బూర్వమే భక్షించి. కాక నేచేసితివే=పూజానగ్నముగాఁ జేసితివిగదా:—అని, వక్రముగా- నీవే చేసితిని, నేచేసితివి అని క్రియలం బ్రయోగించినందులకు విషమపరిహారము.

(12) "భంగి నీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞ చెడను"

సీ. భంగినీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞ చెడక
పోవ దెటువంటి వానికి భూమిలోన
లలన యేమందుఁ జిత్ర మా కలశమునికి
భంగి నీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞ చెడను.

భంగము=అల, భంగములుగలది భంగి=సముద్రము. భంగి=గంజాయి, కలశముని=అగస్త్యుఁడు. భంగినీళ్లు=సముద్రోదకము.

పచ్చికయు మేసి తవుడును బాగుగఁ దినఁ
జేఁప చన్నులలోఁ బాలు చెంబెఁ డుండె.

చేఁపచన్నులు= మత్స్యస్తనములు= విరోధము. చేఁపన్ = పాలు చేఁపఁగా, చన్నులన్=చనుకట్లలో- పాలు చెంబెఁడు నిలువు- పరిహారము.

(21) "కమలాననచంటిమీఁదఁ గాఁకరి మొలచెన్"

క. రమణుం డూరికిఁ బోయెన
రమణి యనఁ జనుల సరము రాచినతోడన్
భ్రమఁజెందె ననఁగఁ బులకలు
కమలాననచంటిమీఁదఁ గాఁకరి మొలచెన్.

కాఁకరి= కాకరపాదు. కాఁక + అరి = విరహాగ్నిపగుడఁగఁ జెల్లు.

(22) "వావిరికడఁద్రోచి తెలిసి వారికిఁ బలికెన్"

క. శైవాత్మకాస్య యొకతె
యీవని నీతపసి యనుచుఁ గృష్ణునిఁ జెలికిన్
భావముగ నడిగి నదియున్
వావిరికడఁద్రోసి తెలిపి వారికిఁ బలికెన్.

వావిరి కడన్ ద్రోసి,= అనర్థము. వావిరిన్= వావిరియనుశబ్దములోని, కడన్= చివరియక్షరమును, ద్రోసి—విడిచివైచి, "వావి" అనుచు. దానిం దెలిపి పలికెనని భావము.

(23) "ఖానుఁడు వేంచేసి రాఁగఁ గంటివె చెలియా"

క. ఆనాఁడు యవనకన్యక
మానము చేకొన్నవాఁడు మాన్యుఁడు త్రిజగ
త్త్రాణుఁడు ధీరుఁడు నిర్జిత
ఖానుఁడు వేంచేసిరాఁగఁ గంటివె చెలియా.

నిర్జితఖానుఁడు= తురుష్కుని జయించిన రంగనాయకుఁడు. రంగేశుఁడు తురుష్కుని జయించి తురకవాచ్చారును గాంధర్వమున వరించెనని పురాణప్రసిద్ధము.

(24) "మణి కరఁగును గానచంద్రమసులను దక్కన్"

క. మణి కరఁగు గీతిచే విధు
ఘృణిచే లోకమున రసికుఁ డింతిచనుమొనల్
పుణుకుటయె చాలుఁ జొక్కి ర
మణి కరఁగును గానచంద్రమసులను దక్కన్.

గానమున రాలు గరఁగును, చంద్రమునిచేఁ జంద్రకాంతమణులు కరఁగును, గానమును జంద్రముఁడును లేకుండఁగనే పసునిచే రమణి కరఁగును.

(25) "కంబలి తిని పెరుఁగుపట్టి కాఁపుం గంటిన్."

క. సంబళమును గొనఁగా గ్రా
మంబున కంపితిని యాను మణిధనములే వి
త్తం బొసఁగ లేమి నాఁకటి
కంబలి తిని పెరుఁగుపట్టి కాఁపుం గంటిన్.

కంబలి=సంబళము. ఆఁకటికి + అంబలి సంబళము-జీతము. మణి ధనములు=ఉద్యోగులు. ఆధికారులు. మణికము.

(26) "బోటికి నెండైన వస్త్రముంతురె చెలియా."

క. పూఁటకుఁ బూఁటకు మేము
బోటికి మేలైనవస్త్ర మొసఁగఁగవచ్చున్
హాటకమయ మగు నచ్చో
బోటికి నెండైన వస్త్రముంతురె చెలియా.

బోటికి వస్త్రముంతురే-ఇది విషమము. ఆ + చెంబు + ఓటికిన్ = ఆచెంబునకుఁ గల ద్వారమునకు, అని పరిహారము. ఓటిచెంబునకు మాటింతురు గాని గుడ్డలెవరు పెట్టుదురు గదా!

(27) "ఉత్తరమున సూర్యబింబ ముదయం బయ్యెన్."

క. మత్తాళిచికుర నాపతి
కత్తఱిఁ దములాపునుపు లంపిచ్చుచు నా
చిత్తేశుఁ డనెను పలుకున
నుత్తరమున సూర్యబింబ ముదయం బయ్యెన్.

ఉత్తరము=ప్రత్యుత్తరము. ఉత్తరము చెప్పినవిధముగా-

(28) "ఈఁగయుఁ బులి సమముగాని యేర్పడి యుండెన్."

క. ఈగుంటకడను నీళ్ళను
ద్రాగుటకు బ్రాఁగఁ బొంది దారంబిడి వే
వేగఁ దుపాకిని నెత్తఁగ
నీఁగయుఁ బులి సమముగాని యేర్పడి యుండెన్.

ఈఁగయుఁ బులియు సమముగా నుండుట విషమము. ఈఁగ=తుపాకి మొగలా టమున గుఱి తెలియుటకై యుండునంట (ఉండ). ఈఁగయుఁ బులియు సమముగాని యున్నది యనఁగా లక్ష్యము సరిగానుండె ననుట—

(29) "వంకాయను జెఱకురసము వడియుచునుండెన్."

క. పంకజముఖపై నామక
రాంకున కేమిటికిటకొ యానుగముల ని
శ్శంకముగఁ జేద నప్పుడు
వంకాయను జెఱకు రసము వడియుచు నుండెన్.

వంకాయను, వంక + అయెను. వంకరగాఁబోయెను. ఇక్షుధనుస్సు గనుక- అచెఱకు రసము వడిసెను. పద్యములో వంకాయెను, అనియున్నది. వంక + అయెను- అనునది సరియే కాని వంకాయ- అనివంగకాయకురూపముశోధనీయము. వ్యవహారములోనిట్లని బట్టిరియే.

(30) "కలికిని గనుఁగొంటి డేగకాల న్మింటన్."

క. పొలమున నారణపక్షిన్
బలిమిని దాప యని తూఁటి బహువేగమునం
దలపట్టి యీడ్చునప్పుడు
కలికిని కనుఁగొంటి డేగకాల న్మింటన్.

కలికి=స్త్రీ. వి. మింటఁగొంటిని- విశేషము. నారణపక్షికలికి=నారాయణపక్షి కగముసంమందు, (తురాయి) యగుఁదను. డేగ పట్టి యీడ్వఁగా దానికాలిని బట్టి వని- కలికతురాయి.

(31) "రతిపతి మన్మథుఁడు గాఁడు బ్రహ్మాయె తలఁపన్."

క. సతతము వీణావాదన
చతురతఁ దన రత్నసభను జలజాపం బా
వితమునను జేయు నాభా
రతిపతి మన్మథుఁడు గాఁడు బ్రహ్మాయె తలఁపన్.

(32) "బీరకాయకన్ను చేరెఁడంత."

గీ. వినను గనను లేదు విశ్వంబులో వింత
గంటి నేను జాలఁ గన్నులార
నీవుఁ జూడరమ్ము నిక్కంబు కనకజం
బీరకాయ కన్ను చేరెఁడంత.

కనక, జంబీర, కాయ=బంగారు, నిమ్మపండువంటి, శరీరము, గల స్త్రీయొక్క, కన్ను=నేత్రము- చేరెఁడంత.

(33) "రతనమునకుఁ గుఱుతు దంతిరథఘోటకముల్."

క. సతతము సరసామాత్యుల
మతివిభవము గూడ రాష్ట్రవర్ధన మెప్పుడుం
గుతుకమ్మునఁ జేయు నలదో
రతనమునకు గుఱుతు దంతి రథ ఘోటకముల్.

(34) "అమ్మనన్నను నవల సయ్యాట గలదె."

గీ. పిన్నపం డమ్ముచును నొక్కనెలఁత రాఁగ
గొప్పవిగ రెండుపండ్లు గైకొందు ననఁగ
నేల పలుమాట లాడెద విటుల విటుల
కమ్మనన్నను నవల సయ్యాటగలదె.

అమ్మను=నిమ్మపండ్లువిక్రయింపను, అమ్మను=తల్లిని. పండ్లమ్మనని పిన్నకటువదు గుటయేల. అమ్మను- అని వావి తెల్పినప్పుడు విటులసయ్యాటము లుండునా.

(35) "బోడికిఁ గొప్పుంచ మిగుల ముద్దులు గులికెన్."

క. ఏడను వినికియుఁ గలదే
బోడికిఁగొప్పుంచు కలుకు భువనస్థలిలోఁ
గోడిమిటారికి నాపూఁ
బోఁడికిఁ గొప్పుంచ మిగుల ముద్దులు గులికెన్.

పూఁబోడికిన్=పుష్పసదృశశరీరముగల స్త్రీకి.

(36) "పలుకులనే చెప్పుకతనఁ బలుకులె యయ్యెన్."

క. పులకండము లంచని తే
నెలటుం చని పలుకుచుండ్రు నేరనివారల్
కలికికిఁ బలుకులు కపురపుఁ
బలుకులనే చెప్పుకతనఁ బలుకులె యయ్యెన్.

(37) "గ్రామమ్మున కోసఁగె శివుఁడు కంజాక్షునకున్."

క. తామరలు వేయి పూజకు
నేమంబున నొకటి దఱుగ నేత్రం బిడినం
బ్రేమం జక్రమ్మును సం
గ్రామమ్మున కోసఁగె శివుఁడు కంజాక్షునకున్.

గ్రామము- నివసము, సంగ్రామము=యుద్ధము- సమాధానము.

(38) "తెలిమఱుఁగే చాలు వేఱ తెరమఱుఁగేలా."

క. తెలివా నీయధరమునే
విరతము నాశించి యుంన నీవును జేరఁగా
మఱుఁగిడి తడిసెఁటియా వా
తెలిమఱుఁగే చాలు వేఱ తెరమఱుఁగేలా.

తెర=మఱుఁగుచీర. వాతెలి=మోవి.

(39) "రంగపతే తురక గాక రంగప తౌనా."

క. అంగనఁ గొని వానింటను
బొంగలి నడివెట్టఁ దినియెఁ బొంగ యగ్గా
గంగాధర యేమందుఁ దు
రంగపతే తురక గాక రంగపతౌనా.

తురంగపతి=అశ్వపతి- పాదుషా. రంగపతి=శ్రీరంగనాయకుఁడు.

(40) "హారంబులు లేక యమసుతాటరుదే కా."

క. ధీరతను దెంపుచేసుక
ఘోరాహవభూమిఁ గొనఁ గూలిన మేటా
శూరగణ మప్పు డమృతా
హారంబులు లేక యమసుతాటరుదే కా.

హారములు=ఆహారములు లేకయే. అమరులు=చావనివారైరనుటవిన్నము. అమృతాహారములేకయే, యుద్ధమునం గీర్తిఁ గూరు లమరులైరని సమాధానము.

(41) "గాలికి సదృశములు యువతికఠిన కుచంబుల్."

క. వలుఁగసమములు కన్నులు
కాలాహికి సాటి వేణి కాముని విల్లా
భ్రూలత లన్నట్లగును న
గాలికి సదృశములు యువతికఠినకుచంబుల్.

నగ + అలికి=నగాలికి, కొండలగుంపునకు.

(42) "ధీరుఁడు రణ మన్న వెఱచుఁ దెంపరిగామిన్."

క. సూరునిఁ గన్న దివాంధము
వైరినిఁ గనుఁగొన్న క్రొంగ వంశాననమున్

జేరినప్పుగ మన్నట్ల య
ధీరుఁడు రణమున్న వెఱమఁ దొంపరిగాఁడై.

(43) "రాముని సతి గుణము శబ్దరాశిం గొలిపెన్."

క. భూమీశు నెదురు వారల
పై ముందును గుండ్లు దుపాకిని విడి తా
రేమఱు బాదరు నుంచిన
రాముని సతిగుణము శబ్దరాశిం గొలిపెఁ.

రాముని సతి యగుసీతగుణము శబ్దరాశిం గల్పించుట- విషమము.

రామునిసతి=జానకి; గుణము=త్రాడు. జానకిత్రాడు, పూర్వము కర్ణాటకప్రభుపా లకు జానకిత్రాళ్లచివర నగ్ని ముట్టించియుంచి, బారుదు, అనఁగాఁ దుపాకిమందు, పోసిన తుపాకి చెవికిఁ దగిలించిన నది శబ్దముచేసెడిది, అరచెట్టువార మొదలగు కొన్నివారల తోఁ ద్రాళ్లుపేని నిప్పంటించిన నది యాఱకుండ రగులును. రంజకమంటుకొనిన శబ్దించును. రామునిసతిగుణము=జానకిత్రాడని కల్పింపఁబడెను. లక్షితలక్షణముగా గ్రహించునది.

(44) "మీసానకుఁ గాళ్లు మూఁడు మేదినిఁ గల్గెన్."

క. మీసానకుఁ గాళ్లె క్కడ
బాసిగ విన్నదియు లేదు వసుధాస్థలిలో
వాసనగంధము రాదు
మీసానకుఁ గాళ్లు మూఁడు మేదినిఁగల్గెఁ.

మీసానకు=మీసమునకు- మీసానకు=మీఁగండపుసానకు-

(45) "పులి దాసరులకును బెట్టెఁ బొట్టలు నిండన్."

క. పులి మొనరఁ బడినచోఁ దిరు
మలరాయని వేఁడుకొనఁగ మనసున నొకఁడా
వలఁ దొలఁగిపోయె శాంతతఁ
బులి దాసరులకును బెట్టెఁ బొట్టలునిండన్.

పులి హింసచేయక తొలఁగిపోయినది. అతఁడు పిదప వేడుకొలుచొప్పున దాసు లకు భోజనము పెట్టెను.

(46) "వాలంబులు రెండు నిండుబ్రాతునకున్."

క. కేలను గేడము వీఁపున
మేలౌ తరకసము బాహు పేటి న్నలచే

కోలావమదలలోఁ గర
వాలంబులు రెండు నిండుబంట్రొతునకుఁ.

(47) " విధవా నీ మగఁడు న్నిండు వేకటి గదవే. "

క. విధుశేఖరుసతి యాజ్ఞను
మధురాధర యొకఁ గూడె మారుని కేళిన్
బుధుఁ డేమి చెప్ప గృహాదట
విధవా నీమగఁడు నిండువేకటి గదవే.

విధవా నీ మగఁడు=అనునది విషమము.

గృహాదటవిధవా=గృహాత్=ఇల్లుగాఁజేసికొనిన, అటవి=అడవిగలవాఁడే,ధవా=పెనిమిటిగాఁగల గౌరీవనితా=నీమగఁడు పరిపూర్ణగర్భమును దాల్చె నని సమాధానము.

వైవస్వతమనువు పుత్రుం బడయఁగోరి వసిష్ఠుం బ్రార్థించి యతనియాజ్ఞచే యాగ మొనరించిన, కతనిభార్య యిష్టముచొప్పున హోత ప్రయత్నము ద్వారా. కుమారి జనించెను. మఱియు వసిష్ఠునిప్రయత్నముచే నాకుమారి కుమారుఁడయ్యెను. ఆకుమారుఁ డొక నాఁడు వేఁటకుఁ బోవలె మేరుపర్వతాగ్రస్థ కుమారవనముఁ జేరఁగాఁ బూర్వమే యొక కారణమున శివునిశాప మావనమున కేర్పడినచొప్పున స్త్రీరూపము కలిగెను. తత్సమయమున బుధుఁడు, ఆస్త్రీని గూడిన నామెకు గర్భమై పురూరవునిం గనియె నని పురాణ ప్రసిద్ధము. పురుషరూపమున నున్నపుడు ప్రద్యుమ్నుఁ డని యు, స్త్రీరూపమున నిలాకన్య యనియుఁ బేరులంగాంచెను.

(48) " పగటిఁ జంద్రిక గనుపించెఁ బద్మనయన. "

గీ. బాగములు సేయుమను వేడ్కఁ బలుకులాడఁ
దమ్ము రసమింతకొకప్పెఁ దగిలియుండ
నేమి యనఁగొంక తెలుసుక యింతినవ్వ
పగటిఁ జంద్రిక గనుపించెఁ బద్మనయన.

(49) " గుండేటికిఁ గొమ్ములాఱు గుక్కకువలెనే. "

క. మందకడఁ దఱిమి పట్టిన
పందుల మూఁడు పసరమ్ము లదరి పొడిచినన్
ముందుబడి వెనుక దూసెను
గుండేటికిఁ గొమ్ములాఱుఁ గుక్కకువలెనే.

మందలో కొకకుక్కయును గుండెలును జగడమాడఁగా నక్కడనున్న మూఁడు పసరములు బెదరి యాకెంటిని దమకొమ్ములతోఁ బొడువఁగా మూఁడావుల యాలు కొమ్ములును గుండెటికిని గుక్కకును గూడ గ్రుచ్చుకొనియెనని-

(50) "చేప కొంగను మ్రింగెను జెట్టుపైని."

గీ. బలునిడివి యైన దాసరిపా మొకండు
చెట్టుమీఁదను గొమ్మను జుట్టుకొండి
డెలియకను గూఁటిపిల్లలఁ గలయ ముక్కు
చేప కొంగను మ్రింగెను జెట్టుపైని.

కొంగ యొకచేఁపను దనముక్కుచేత బెట్టుకొని యొక్కవృక్షముమీఁదఁ గట్టియున్న గూఁటియందుఁ గలతనపిల్లలకు నిచ్చునపుడు ఆవృక్షముమీఁది కొమ్మనుజుట్టి కొనియున్నపాము చేఁపను ముక్కునందుఁ బెట్టుకొనియున్న కొంగను మ్రింగెను.

ముక్కునందుఁ జేఁపగలకొంగ ముక్కుచేఁపకొంగ.

(51) "దీపముశిఖమీఁద నీఁగ స్థిరముగ నిలిచెఁగా."

క. శ్రీపతికి భక్తి ధూపము
దీపము లిచ్చెడువితాన ధీరుఁడు వ్రాసెన్
గోపురముమీఁద వెరుకన్
దీపము శిఖమీఁద నీఁగ స్థిరముగ నిలిచెన్.

గోపురముమీఁద వ్రాసిన దీపపుశిఖమీఁద నీఁగ వ్రాసెనని-

(52) "కుంతికిని నుంపశంబయ్యెఁ గులుకులాఁడి."

గీ. ఖడ్గితో నర్కమాసంబు గలిసియుండెఁ
జక్రితోడను నట్లనె సరసుకొనియెఁ
బోటుకాఁడని మదినెంచి పూని యిపుడు
కుంతికిని నుంపశంబయ్యెఁ గులుకులాఁడి.

ఖడ్గముగలవాఁడు ఖడ్గి. చక్రముగలవాఁడు చక్రి. అట్లే కుంతము=(బల్లెము)ను చేతఁబట్టినవాఁడు కుంతి. ఆకుంతాయుధధారితోఁ గులుకులాఁడి యిప్డుండెనని భావము.

(53) "కడుపునఁ బెట్టుకొని ప్రోచెఁ గమలోద్భవుఁడున్."

క. మడుపులమీఁదను నాసలు
విడఁబడ వెవ్వారికైన విస్మృతమా బు

త్రపికొంచెము వడి దొరకినఁ
గడుపునఁ బెట్టుకొనిప్రోచెఁ గమలోద్భవుఁడున్.

బ్రహ్మదేవునకు హిరణ్యగర్భుఁడను పే రున్నదిగాన నుత్తడిని గడుపునఁబెట్టుకొని కాఁచెనని చమత్కరించెను. పుత్తడి=బంగారు.

(54) "కజ్జలధవళావతంసకమలముఁ గంటిన్."

క. గొజ్జంగనీటి నొకసతి
మజ్జనమై రాఁగఁ జూపు మాటికిపోవుల్
కజ్జలరా దేఁటులు నిలఁ
గజ్జలధవళావతంసకమలముఁ గంటిన్.

లోచనములు కర్ణాంతాయతములై యుండఁ గుముదభ్రాంతిచేఁ దుమ్మెద లచటు వ్రాలఁగాఁ జూచువారికిఁ గాటుకతోఁ గూడిన తెల్లనికర్ణభూషణమో యనునట్లుండెను. కజ్జల=కాటుకతోఁగూడిన, ధవళ=తెల్లనైన, కర్ణావతంసకమలము=విలాసమునకైఁ గర్ణమునధరించిన తెల్లకలువ.

(55) "కొల్లడమున నొక్క చేఁప కొంగను మ్రింగెన్."

క. అల్లని హాస్యము సేయఁగ
బెల్లమునం జేసి పక్షివితతిని గొని రాఁ
గొల్లపడి పల్లగంపయుఁ
గొల్లడమున నొక్క చేఁప కొంగను మ్రింగెన్.

కొల్లడము=తిరుచినాపల్లిసమీపమునఁ గావేరీనదినుండి భాగమై పాఱునొకనది. గంపలోనున్న బెల్లపుకొంగను మ్రింగెనని భావము.

(56) "పాలు త్రావకయుండియు బలిమికలిగె."

గీ. ధరణినల్లెడ బిడ్డలు తల్లిచనుల
పాలు త్రావకయుండిన బ్రదుకు టరుదు
వింతయిది చూడనో కాదొ తాఁబేటిపిల్ల
పాలు త్రావక యుండియు బలిమికలిగె.

(57) "మలుకుగదా పంద రణము చూచినవేళన్."

క. కలుకటితోడను యుద్ధం
'బిరువాగున నడచుచుండ నేర్పడ మడియం

దిరవశా దిగులునఁ బదయం
చెఱుకుఁ గదా వంద రణము చూచినవేళన్.

పదయందుకా, ఉఱుకుఁగదా=పాఱిపోవునుగదా.

(58) "కిన్నర నటువెట్టి బాల కిలకిలనవ్వెన్."

క. పున్నమచంద్రుఁడు మెఱయం
దిన్నఁగఁ దెమ్మెఱలు విసర ధీరత దప్పం
జన్ను లని కాయలంటిన
కిన్నర నటువెట్టి బాల కిలకిలనవ్వెన్.

అంటినవాఁడు విటుఁ డని తలఁపవలయును. భ్రాంతిమంతము, ఉన్మాదసంచారి భావము.

(59) "అయ్యయ్యో ప్రౌఢ ముగ్ధయై విలసిల్లెన్."

క. తియ్యని మోవిని గ్రోలఁగ
నయ్యెడ నేమియును దెలియ కతిమోహమున
న్నెయ్యమున నేమిటోఁ బక
యయ్యయ్యో ప్రౌఢ ముగ్ధయై విలసిల్లెన్.

ఇందు, ప్రళయ మను సంచారిభావము.

(60) "నలుగురిమట్టునను నిలిచె నాయిల్లాలే."

క. కలువలదొర గంధర్వుఁడు
జ్వలనుఁడు నావెనుక నరుఁడు సరసీరుహనే
త్రలకుఁ బతులగుదు రాఁగా
నలుగురిమట్టునను నిలిచె నాయిల్లాలే.

(61) "మామం దాత యని యొకనిపై సతి వడియెన్."

క. కామిని యొక్కటి వినవే
యామని స్వేదంబు నధికమై యపు డేవన్
ఏమని చెప్పుదు నహహా
మామం దాత యని యొకనిపై సతి వడియెన్.

(ద్రౌపది) మామను- భీమునితండ్రియగు వాయువును- తాతయని- వాయువు అగ్నికి దండ్రి. తాను అగ్నిలోఁ బుట్టినదికావునఁ దనకు వాయువు తాత. (స్పష్టముగా లేదు పద్యము.)

(62) "కంచులకును నెల్లమట్టి కావలయును గా"

క. ముందుగ మాటలబిగువులు
నెందుకురా కూడ దీవు నేర్పడి నాతో
నందఱుఁ బొర్లరె మట్టిని
గందులకును నెల్లమట్టి కావలయును గా.

మల్లయుద్ధమందు పోరునవాఁడు మఱియొకనిం జూచి నీవిట్టికసను నాతోఁ జెల్లదు. ఎల్లమట్టిలోఁ బొరలిననారి నెందఱినో చూచినాఁడను. కందులుకూడ నెల్లమట్టి పూసికొని యున్నవి. నీ వెంత నీసామర్థ్య మెంత యని తాత్పర్యము.

(63) "రాముని కోపము వసిష్ఠుల నొప్పించెన్"

క. సేమముగ విందు పెట్టిన
నామానివరేణ్యుగోవు నడిగిన నీయన్
ఏమఱక యుద్ధభూమిని
రాముని కోపము వసిష్ఠుల నొప్పించెన్.

రాముని=రాజమౌని. విశ్వామిత్రుఁడు, రాముని=విశ్వామిత్రుని కోపము; వసిష్ఠున కు బాధక మయ్యె ననుట. కాని రాముని=దశరథరామునియొక్క అని కాదు. యుద్ధభూమిని, రాజ=రాఁగా మునికోపము అనియుం జెప్పవచ్చును.

(64) "కరపదవదనముల నొక్కకట్టియ దూసెన్"

క. సురతాణి లగ్గవెట్టఁగఁ
గలకొలములు నాటఁ బంటఁ గలచుక తీయన్
వెలవాఁడు వేయు నప్పుడు
కరపదవదనముల నొక్క కట్టియ దూసెన్.

ముల్లు నాటికొనినందున నొక్కఁడు కాలిని చేతిలోఁ బట్టుకొని పంటితో నాము ల్లూడఁదీసికొనుచుండ వేఱొకఁడు దారినిపై నంపకట్టియ వైవ ముల్లుతీసికొనువాని కరము, పదము, వదనము నీమూఁటియందు నొక్కబాణమే గుచ్చి చనినది.

(65) "పులినిబడె గుంపు వందియు నెలుఁగు నీర్గె."

గీ. పులికిఁ జూచుకంటఁ జెంతల మెలఁగువాని
పైఁబడక మాన దిది వినఁబడిన మాట

మాటుమఱుఁగునఁ బొలకువ మీటమీటఁ
బులినిఁ బడె గుండు పందియు నెలుఁగు నీల్గె.

పులి, పంది, ఎలుఁగును నీరుత్రాగుచుండఁగా వేఁటకాఁడు మాటుననుండి తుపాకి మీట మీటినాఁడు. గుండు పులిమీఁదఁ బడినది. అది కోపముచే దగ్గఱనున్న పందిని, ఎలుగును జంపి తాను జచ్చినది.

(66) "వీఁపునఁ జను లుండె గోళ్ల వెంద్రుక లుండెన్."

క. ఆపురుషుం డాపడఁతిని
వైపున సిగ వేయు మనుచు వచియించెను దా
రాపద్మాక్షికిఁ జనుదు
వీఁపునఁ జనులుండె గోళ్ల వెంద్రుక లుండెన్.

సిగ వేయుటకు వెనుక నున్న దానిస్తనము లాతనివీఁపున నున్నవి ఆమెగోళ్లలో వెంద్రుకలున్నవి.

(67) "రథమునును బండి తినుట చిత్రంబుగాదె"

గీ. పారసాక్షిరో నీమగఁ డూరలేఁడు
బహుదినాలుగ నదియు నీపట్ల వాసి
శంకరునివింటితునక శరచ్ఛవిని గనుట
రథమునును బండి తినుట చిత్రంబుగాదె.

ఒకస్త్రీ గర్భముదాల్చి బయ్యాంకలగుణముచే మన్ను తినుచున్నది. ఆమె మగఁ డూరలేఁడు. ఉండిన భయముచేఁ గొంతమాననుు, అని భావము. శంకరునికి భూమి రథము సూర్యచంద్రులు బండ్లు అని త్రిపురసంహారకాలపురాణకథ గలదు. రూపకాతిశయోక్తిగా రథమును అనఁగా భూమిని (మట్టిని) బండి—అనఁగాఁ జక్రమైన చంద్రుఁడు (ముఖము) తినె ననుట.

(68) "అశ్వినికి వెన్నలో నుండునది యొసంగె."

గీ. ఎచటనే యుండివచ్చె నీయెమ్మెకాఁడు ?
పుట్ట కావలిదిక్కుకుఁ బోయివచ్చె.
నేయి కానుక యొసఁగెనే యింతి నీకు ?
వశ్వినికి వెన్నలోనుండునది యొసంగె.

[illegible] — [illegible] —. అశ్వినికి వెన్నలోనుండునది—ఐరణి.

(69) "అల్లె ఖేటకమును గూడ నైనఫలము."

గీ. పతి యిచట లేనివేళ రేవకడయందు
సర్పమణిఁ దెచ్చి తా బొమ్ముచక్కి నిడిన
సర్పణము సేతు గరుడ నీకధికభక్తి
నల్లెఖేటకమును గూడనైనఫలము.

నాథుఁ డింటలేని యీసమయమున సర్పమణిన్=భుజంగరత్నమును (నాగనాయకుని) దెచ్చి తాన్- బొమ్మకడ నిడినయెడల, గరుడ=ఓవినాయక! (వి=పక్షులకు నాయక=ప్రభువా) నీకు అధికభక్తిన్ అల్లెఖేటకమునుగూడన్, అల్లె=నారి, ఖేటకము=కేడము (డాలు) నారి కేడము ననురెండుపదములుంగూడినప్పుడు అయిన ఫలమును అనఁగా నారికేడమును=టెంకాయను నీకర్పణచేయుదును. భుజంగులు=సర్పములు జారులు. ఖేటకశబ్దమునుండి కేడెమైనదని యందురు. ఖేట కేడ కావచ్చును. నారికేడము దళలకు భేదము మాన్చిన నారికేళము కాఁగలదని సమర్థింపఁదగును.

(70) "అన్నను సవతి యని పోరునట్లే యమ్మోర్."

క. వెన్నుఁడు మోహినిగా నా
చున్నయెడన్ శివుఁడు చూచి సొక్కుచుఁ దాఁబై
కొన్నఁ గని డెంద మోర్వక
యన్నను సవతి యని పోరునట్లే యమ్మోర్.

అన్నగారిని సవతి యని పోరుట యెందైనఁ గలదా, కలదు. విష్ణుదేవుఁడు పార్వతికి అన్నవరుసవాఁడఁట. ఆవిష్ణువు మోహినివేషము వేసినపుడు శివుఁ డామోహినిని మోహింపఁగాఁ బార్వతి నాయన్నయే నాకు సవతి యయ్యె నని కలహించె నని చమత్కారము.

(71) "ఇనతనయునిఁ జూచి రాముఁ డిట్లని పలికెన్."

క. ఇనతనయుఁడు రాముని గని
తనయన్నను నీవు గూల్చుదా రెట్లన్నన్
మును సాలములఁ గూలిచి
యినతనయునిఁ జూచి రాముఁ డిట్లని పలికెన్.

ఎట్లు నీవు వాలిని జంపెద వని సుగ్రీవుఁ డడిగిన ముందుగా నేడుసాలవృక్షము లం గూల్చి, యినతనయునితో 'నిట్లు' అని రాముఁడు పలికె నని సమాధానము, అభినయరూపమునఁ జెప్పినమాట.

(72) "వజ్రము వెన్నక్కఁ గెంపువలెఁ గన్పించెన్"

క. వజ్రసమనాస వినుమీ
వజ్రీఁడు మదాంధరిపుల మార్కొని పొడువన్
వజ్రముపో ల్జముదాడిని
వజ్రము వెన్నక్కఁ గెంపువలెఁ గన్పించెన్.

ఒకశూరుఁడు శత్రువులను జముదాడిచేఁ బొడుచునపు డది దూసి వెన్కకుఁ జన వారియొడళ్లనుండి నెత్తురు కాఱెను. ఆనెత్తురుపూసికొని యా జముదాడి వజ్రము కెంపు వలె నెఱ్ఱఁగఁ గనుపట్టెను. అని సమాధానము. జముదాడి వజ్రము=చివర, కొన.

(కఠినప్రాసశబ్దచిత్రాక్షరయుతివంచనా సమస్య.)

(73) "గ్లావిమలాక్షు వేంకటనగాధ్యక్షా"

క. దిగ్లలనాకబరీధర
స్రగ్లాలితకీర్తిజాల సద్గుణశీలా
విగ్లపితరక్షమార్త్రాం
దగ్లావిమలాక్షు వేంకటనగాధ్యక్షా.

(74) "విధ్యండము లీక్షరీతి విశ్రుతమయ్యెన్."

క. అధ్యాత్మవిద్య యుపనిష
దధ్యయనముఁ జేయఁ జేయు నర్థము బయలై
సాధ్యం బైనను దలఁచిన
విధ్యండము లీక్షరీతి విశ్రుత మయ్యెన్.

విధ్యండము=బ్రహ్మాండము. లీక్షరీతిన్=ఈరువలెనే. ఈరనఁగాఁ బేనుగ్రుడ్డు.

అధ్యాత్మవిద్యాపరిశ్రమముచేసినవారికి బ్రహ్మాండము, ఈరువలె సూక్ష్మముగా గనపడు నని భావము.

కఠినప్రాస పునరుక్తాభాసవిషమసమస్య.

(75) "గోగ్రణిగోఽగ్రణీగవాగ్రణియనియెన్."

క. అగ్రజ గోశబ్దము పై
నగ్రణిశబ్దంబు గూడ నదియె ట్లగుసం
ధిగ్రహణముఁ దెలుపు మనన్
గోగ్రణి గోఽగ్రణీ గవాగ్రణి యనియెన్.

(76) "గోఅగ్రణి నెక్కి శివుఁడు గొబ్బున వెడలెన్.

క. భో అమృత భో బ్రహ్మన్
భో అంబరచారిణాంవిభో సర్వేదే
వా ఆయాతవ్యా యన
గోఅగ్రణి నెక్కి శివుఁడు గొబ్బున వెడలెన్.

(77) బాహ్లికహాయమెక్కి రాజు పోఁజుకువెడలెన్."

క. ప్రహ్లాదవరదుఁ గొల్వఁగ
నాహ్లాదము మానసంబునందు జనింపన్
బాహ్లికరసవర్ణం బగు
బాహ్లికహాయ మెక్కి రాజు పోఁజుకు వెడలెన్.

(78) "కల్హారమరందమట్లు కల్లికిఁ బల్లుల్"

క. బల్హాయి తోఁచునట్టి రయి
దల్హాయులై నట్టి నిల్లడల్ గనుఁగొన్నన్
మేల్హాదంటి నిఖాబురి
కల్హారమరంద మట్లు కల్లికిఁ బల్లుల్.

(79) "చందురులోఁ గందు మిగుల సమ్మదవృత్తిన్"

క. ఎందుకుఁ బలుమాటలు మీ
కిందఱకును భ్రాంతియేల యీయింతిముఖం
బందము వేతే లే యల
చందురులోఁ గందు మిగుల సమ్మదవృత్తిన్.

ఇది అగోపనసమస్య. ఈయింతిముఖులకుఁగను చంద్రునియందు కందుఁ=చూచె దను కనఁగొందురు అని భావము, కాని చంద్రునిలో కందు=కళంకము అని కాదు.

(80) "దాన పులి మొన యమ్ము శాఖ తుద లని పలికెన్"

క. వనజాంబకుండు నమఁగని
కినుకం గసలుచును గనులఁ గెంపు జనింపన్

వనతూపు లేసి రమ్మను
దొనపులి మొనయమ్మశాఖితుదలనిపలికెన్.

ఇది-అంతర్లాపిసమస్య-దొన, పులి, మొన, అమ్మ, శాఖి, ఈశబ్దములతుదలు, అంత్యాక్షరములు, నలినముఖి అనియగును. ఒక స్త్రీ తన చెలికత్తెను జూచి దానితో ఓనలినముఖి నన్ను మన్మథుండు గమ్మను నని పలికె నని భావము.

(81) "నారదవంద్య కాంతిజితనారద కౌఁగిలి నీయవేమిరా"

క. మదనుఁడు కోపముచేతం
గదనంబును జేయఁ దొడఁగెఁ గ్రక్కున నోనా
రద వంద్య కాంతిజితనా
రద కౌఁగిలి నీయవేమిరా యిదియేరా.

ఇది వృత్తగోపనము—ఉత్పలమాలవృత్తమువలె సమస్య కానిపించుచు, గాని, కందపద్యములో నిమిడిపోయినది.

(82) "కలిమిబలిమి ఫలముచలము కళుకుకులుకు తీవియావి కలిగి మెలఁగి నీవలరుమీరా."

క. కలిమి బలిమి ఫలముచలము
కళుకు కులుకు తీవి యావి గలిగి మెలఁగి నీ
వలరు మీఁకఁ బలుమఱును గలు
ములను గల కలికి ప్రతిదినము కరుణ సేయున్.

ఇది వృత్తగోపనగతిభేదసమస్య.

(83) "అనఘులు హరిహరు లనయము దయచే మనువఁ జెలువు గులుకును జగతిన్."

క. వనజాస్య వింటివా తెలి
యను నాయనఘులు హరిహరు లనయము దయచే
మనువఁ జెలువు గులుకును జగ
తిని నాచెలువకును సాటి తెఱవలు గలరే.

ఇదియును వృత్తగోపనసమస్యయే. "అనఘులు హరిహరులనయముదయచే" నని మణిగణనికరముగా దోఁచును. కాని కందపద్యమే. అనఘులు హరిహరు లనయము దయచే

కాని మనుపఁ జెలువుగులుకును జాతిన్ అని మూలములో మతీగణనిగరము రెండుచరణ ము లీఁబడినవి. కందపద్యములో కాని యను రెండక్షరములు తీసివైచినఁగాని సరిపోదు.

(84) "కలికీ ననుఁజూచి విడెము గైకొను మింకన్"

క. వలరాజు చేతికోలఁదిని
జలమున నాపైని బాణజాలము వేసెం
గలమాట చెప్పి తిప్పెడ
కలికీ ననుఁజూచి విడెము గైకొను మింకన్.

(85) "బావిని బట్టములు దానిపైకడఁ గొండల్"

క. దేవర పరాకు వినుమిది
గో విద్యను నైంద్రజాలికుఁడు నేనని మా
యావిలసనమునఁ జూపి[illegible]
బావిని బట్టములు దానిపైకడఁ గొండల్.

(86) "ముక్కులు నాలుకలు మూఁడు పొలఁతికిఁ గంటిన్"

క. అక్కట యిదేమొ తెలియదు
నిక్కమువలెఁ దోఁచెఁ గలను నిన్నఁటిరేయిం
జెక్కులు పదాఱు నెనిమిది
ముక్కులు నాలుకలు మూఁడుపొలఁతికిఁగంటిన్.

(87) "విధవా నీమగఁడు నిందువేకటి గదవే"

క. విధురథసంబుద్ధి త్వదీ యధవుఁడుఁ పూర్ణమగుగర్భ మన్వాభిధచే
మధురాక్షి తెలుపుమంటివి విధవా నీమగఁడు నిందువేకటి గదవే.

విధురథసంబుద్ధి=విధవా (వి=పక్షి, ధవ=ప్రభువు) గరుడ! త్వదీయధవుఁడు=నీవు గఁడు. పూర్ణగర్భము=నిందువేకటి—అని క్రమాలంకారము-అన్వాభిధచే=మాఱుపేరులతో వచ్చినది. విధురథుఁ డనఁగా విష్ణురథుఁడు, గరుడుఁడు, గరుఁడునిసంబుద్ధి, విధవా ! పక్షిరా[illegible]!

(88) "చేతోజాతదవానలంబుడుపవే సీమాటి యీమాటికిన్
ప్రోత్సన్నంధుల నంబుయంత్రనలికాప్రోద్గీతగేయౌఘముల్
జ్ఞాతిశ్చ దనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యమ్ముగన్."